శ్రీ

# రుక్మాంగదచరిత్రము

## యక్షగానము

ఉ. శ్రీమధురోష్ఠపుందవికిఁ జిక్కి ధరాసతి కన్నుదామరల్
ప్రేముడు నవ్వు చింతవలిపాటిపుకొనెఁడు చెన్నకేశవ
స్వామి రమావినోదపురసంజ్ఞతఁ గొల్పెడు వాలుమాపులన్
వేమరు నిమ్మరాట్టులుని వేంకటరామయమంత్రి నేలుతన్.

సీ. ఏనుఁగుమొగంబు కొడుకని యేవగింప
కమ్మలియవుసు పెను గారవమ్ముఁ జూప
మొక్కువారల కార్యమున్ దక్కఁబరుప
నెప్పుడాడను వాఁకయ్య నేఁ దలంతు.

ఖరహరప్రియరాగం.

1. కరుణింపుము దేవ గజానన । నిరతము నీప్పాదుచరణ
కమలములే స్మరియింపక మాన॥ గజానన॥ కరు॥
2. పరమపవిత్రా భాసురగాత్రా । యురగయజ్ఞ సూత్రా
గ॥ పురహార వరపుత్రా॥ కరు:ణిం॥
3. కార్యభంగములఁ గడముట్టింపుము । ఆర్యా వినా
య॥గ॥ ఆర్యజనగేయ॥ కరు॥

4. చింతపల్లిపాదుర్పురశాంత సీమంత యోగదంతా॥ గ॥ సంతు
షితస్వాంత॥ రఘు॥

చ. తిలకముదిట్టి నద్దానటఁ దీరగుపాపటబొట్టుఁ దీర్చి ము
ద్దిలుగుఁబటానిఁ గట్టి కుడిచేతను సొంపగువీణఁ బట్టి పా్ర
బల్కుఁగిల్కుటందియలు పాదము ఘల్లుమ్రోయ నాడుచు
న్నలువమొగంబునంగులుకు నాకులవాలికవాణిఁగొల్చెదన్.

సురట—ఆది.

1. వందే జగజ్జననీం భారతీం। వందారుజనతామందార
మాలాం కుందాధరదనా మిందుబింబాస్యాం॥ వం॥

2. పద్యగద్యమయధర్మశాస్త్రసంచారిణీం। మణివాణీం
పద్యస్సంజాతవిద్యుల్లతాంగీం విద్యారూపిణీం విధాతృ
గృహిణీం॥ వం॥

3. మంజీరాంకి చింతపల్లిపాటిపురసదనాం। శ్రీమన్మానవ
ధనాం కంకణకింకిణీకింకారలసితాం వెంకటరాయాభి
ధానవినుతాం॥ వందే॥

—॥ దోహర ॥—

శ్రీమహీధవ చిన్నకేశవస్వామి శార్ఙ్గచాప
శ్యామరూపవనధిబద్ధ కలాపక ప్రసువప్రకాశ
వాణిఁగొలిచి కర్ణాణిఁ దలంచి వారిరాణిఁ బ్రస్తుతించి
పాణిని వల్మీకభవ వ్యాసుల ప్రీతిగను గొనియాడి
వాగనుశాసనుఁ దగు నన్నయభట్టవిమర్శఁ బ్రస్తుతించి
యాగవిధాతను దిక్కయజ్వ నఱ్ఱాప్రెగ్గడ వేడి

వర్థిచకోరనేత్రానందసంధాన
రాజతుల్యులు నిమ్మరాజవారు
గీ. మానినీసరసిభ్రామ్యమాణ మనుజ
రాజహంసలు శ్రీనిమ్మరాజువారు
చక్రిదాస్యసమృద్ధిసర్వేశమోక్ష
గాప్తికాములు మానిమ్మరాజువారు.

—•తోహార•—

తమ్మికొలంకున నెమ్మిఁబాయు కెందామరలో యనఁగ
నిమ్మరాజకులతిలకులు విప్రులు నెగడి రఖిలదిశల.
సీ. బసవరాజాఖ్య కల్పకశాఖ కెవని శు
భావతారము వసంతాగమంబు
ఆదినారాయణాహ్వయహృదామోదప్ర
రోహ మెవ్వనినవ్యరూపరేఖ
అన్నమ్మగర్భవారాన్నిధి కెవని య
భ్యుదయంబు శీతకరోదయంబు
తులకింప వేంకటాచలసహోదరతకైఁ
దాల్చె నెవ్వఁడు దానధైర్యముద్ర
గీ. కంబుకలధౌతకైలాసకామధేను
కాశకలహంస విశదవిఖ్యాతకీర్తి
యతఁడు వేంకటకృష్ణనామాంకరమున
దనరు వేంకటరామప్రధానమౌళి.

సీ. వేంకటరాయపృథ్వీసురవరాళి యె
వ్వనియుపశాఖకు వంశకర్త
వేంకటకృష్ణనామాంకితుఁడైన త
త్పజ్ఞుఁ డెవ్వనికిఁ బితామహుండు
వేంకటరామాఖ్యవిబుధుఁ డెవ్వానికిం
జేర్మిఁ గూర్చిన యట్టి పెంపుతండ్రి
ఖ్యాతచరిత్రప్రభూతసద్గుణమణి
వ్రాత సీతాంబ యెవ్వానిమాత
లక్ష్మిదేవమ్మ యెవనికులంపుకొమ్మ
యాత్మజుం డెవ్వనికి వేంకటాచలపతి
యట్టి శ్రీనివాసరాజవంశాంబురాశి
రామచంద్రుఁడు వేంకటరామమంత్రి.

వ. మఱియు నమ్మంత్రివసంతుఁ డనంతవరప్రత్యంత గ్రామం బగుచింతపల్లిపాటియందుఁ జెన్నకేశవాలయంబు జీర్ణోద్ధారణంబుఁ జేయించుచుం గతిపయదినంబు లందుండి యొక్కనాఁడు శ్వశురనివాసంబున కరుగుదెంచి కృతపరిచితిగలవాఁ డగుటం జేసి వంగలకులాలంకారుఁడ నగునన్ను రావించి శ్లాఘనోక్తిపూర్వకంబుగా నిట్లనియె.

ఆ. చింతపల్లిపాటి చెన్నకేశవునకు
నర్పణముగఁ గేశవాంకితముగ
వకుళమాలభంగి వలపుట్టిపడఁ జమ
త్కృతిగఁ గృతియొసఁగు కృష్ణయకవి.

వ. అనుటయు.

క. తపనీయవాసునకుఁ బం
కపల్లిపాటినగరధామునకుఁ బర
త్రిపురఘ్నునకుఁ బాలితకే
కివాహనునకును జెన్నకేశవున కొసఁగన్.

వ. సమర్పణంబుగ నా నేర్చినంత రచియింపనుద్య
మించిన రుక్మాంగదచరిత్రమునకుం గథాక్రమం బెట్టిదనిన.

— తోహార —

శ్రీమంతంబు జగత్పావన మగునై యశోవహంబు
కామదమై యిన్నిధు లనవద్యు లభంగపోషణములు.

వ. పరమతపోవ్యవసాయసంపన్నులై బ్రహ్మర్షులై
పరమహర్షులైన మహర్షులందఱు,

— తోహార —

విష్ణుదేవునకు నర్పణంబుగా విధివిధాన సమున
వైష్ణవయాగము చేయుచుండు తరి వచ్చు సూతుం డటకు
వచ్చినమాత్రం గనుంగొని మౌనులు వ్యాసశిష్యుఁ దెచ్చి
పెచ్చెర పాద్యం బిచ్చి సముచితాసనం గావించి
పరమానందరసాంబుధిఁ దేలుచుఁ బాగ్యవత్తు లగుచు
హరికథామృతము గ్రోలుతలంపున సమ్మ్రము లిట్లనిరి.

దర్బారు—ఏకతాళము.

1 వందన మిదిగో నార్య పౌరాణికవర్యా నందితగుణధుర్య
విజ్ఞానితసురాచార్యా వం॥

2. చింతపలిపాటిపురనివాంతమున వెలయు కమలాకాంత
ప్రియభక్తుని వృత్తాంతము వింత రవ్వంత॥ ౨॥

తోహర

భూరమణీమణికంఠహారవిస్ఫూర్తి ననుకరించి
వీరవ్రతులకు జన్మభూమి యన విదిశాపుర మమరు.

క. ఆ నగరీవిభవము వల
కానగరముకంటె మిన్నకలచందంబున్
బూని వర్ణింపఫణిపతి
కేని యసాధ్యము విధాత కెన్నఁగ నేలా॥

తోహర

బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రు లప్పట్టణంపువారు
బ్రాహ్మణభక్తిపరాయణులై యొప్పట్టున మెలఁగుదురు.

సీ. కన్యకావిక్రయకలనఁ దేలినవారు
వేదవిక్రయము గావించువారు
అన్నవిక్రయమునం దారితేరినవారు
మాంసవిక్రయమున మనెడువారు
మద్యవిక్రయమున మను వృత్తిఁ గనువారు
దివిరి లంచము దినెడివారు
ప్రాణిహింసాసక్తిఁ బ్రిబలి కుమ్మరువారు
పుణ్యవిక్రయమునం బొదలువారు

గీ. చోరవృత్తికిఁ బొరుగిండ్లు సొచ్చువారు
జారవృత్తికి నెటకేని సాగువార

ఎదుటి మేలుకు లోలోన నేడ్చువారు
లేమిచేఁ గుందువారలు లేరు లేరు॥

తోహర

విదిశానగరము రాజధానిగా విక్రమకంఠీరవుఁడు
మదిరాక్షీనవమదనుఁడు రుక్మాంగదుఁ డేలుచునుండు
పట్టమహిషిసంధ్యావళి రెండవభాగ్యలక్ష్మియై కొలువ
పట్టణమేలును జన్యజనకభావంబు ప్రజలపై నిలువ.

వ. అంత నొక్కనాఁడు రుక్మాంగదమహీవల్లభుండు మంత్రి సామంత విద్వజ్జన పురోహిత హిత నట విట కవి గాయక వందిజనంబులు గొలువఁ గొలువుండి "జ్ఞానవైరాగ్య సిద్ధ్యర్థం గురుపాదోదకం పిబ" యను శ్లోకపాదముం దలంచి యనుపమానతపోగరిష్ఠుండు బ్రహ్మర్షిశ్రేష్ఠుండును దమకుల గురుండు నగు వశిష్ఠమహాముని రావించి భక్తినయుక్తి నాన నార్ఘ్యపాద్యాదివిధానంబులఁ బూజించి విదిశాధిపుం డిట్లనియె॥

గీ. ఏవ్రతముసలుపఁ సంతానవృద్ధి కలుగు
నేవ్రతముఁజేయ సమకూరు నీప్సితార్థ
మెందు నిందును జిరసుఖ మబ్బఁజేయు
నట్టిసువ్రత మొక్కటి యానతిమ్ము॥

తోహర

వినయవివేకంబులతో నరపతి వేఁడినపలుకాలించి
జననాథున కిట్లనియె దపసి వాత్సల్యమతనిపై నునిచి.

కీర్తన

ఏకాదశీపుణ్యవ్రత మాచరింపుమయ్య సాకల్యముగ
వినుము నరోత్తమ బుధి శోకమోహాగ్నుల సోకంగ
నీయనిది॥ ఏకా॥

1. పామరులకైన బండితులకైన గామక్రోధాదులఖండిం
చువజ్రమిది సకలేంద్రియమ్ముల చాంచల్య ముడిగించి
త్రికరణశుద్ధి సుస్థిరముగఁ గల్పించు॥ ఏ॥

2. ఆకలిదప్పులనడఁచి కలకాలము శ్రీకాంతునిచరణసేవ
మరగించును॥ ఏ॥

3. చింతపలిపాటిచెన్న కేశవుని కళ్యాణప్రీతికర మపవర్గ
దాయకము॥ ఏ

వ. రాజన్! ఏతద్వ్రిధాన మెట్టిదనిన దశమినాఁ డేకభు
క్తము నేకాదశియందు నిరాహారముగ నుండవలయు అహో
రాత్రింబు హరిస్మరణపూర్వకముగ శ్రీపతిని పూజింపవలయు
జాగర మాచరించి మరునాఁడు ద్వాదశీపారణము సకాలమందు
ముందు బ్రాహ్మణుల భుజింపఁజేసి పిదపఁ దాను సుహృ
జ్జనులతోడ భుక్తిసలుపవలయు. పగలు నిద్రింపరాదు. ద్వాదశి
నాఁటిరేయి నశనంబుగుడువక యంగనాసంగమం బొల్లక నీమం
బీడేర్పవలయు. ఇది యుత్తమోత్తమం బనువ్రతరాజము దీని
నుల్లంఘింపనివారికిం గైవల్యంబు కరతలామలకంబు.

త్రోహర

మదమున హరివాసరమున గుడిచిన మనుజునిపాతకము
సదమలచరిత యెన్నిపున్నెములు సలిపిన జెడదుసుమి

గురుభామాంతు దురితంబేనియుఁ గూలిపోవుగాని
హరివాసరభుక్తాన్నదోష మదుగంటదు నరనాథా
గరువశనంబున నీస్వవశముఁ బరిహరింతు రేని
నరకకూపమున బడుట నిశ్చయము తరణికులాధరణా.

ఆ. అలుక చేతనైన నశనమబ్బమినైనఁ
దెగులుచేతనైనఁ దెగువనైన
సారిది హరిదినమున శుష్కోపవాసంబు
సంభవించు నేని జాలమేలు.

తోహర

తిండిపోతులకు నీ నియమము పెనుగొండవలెన్ దోఁచు
రెండవపద్ధతిఁ దెల్పెద విను ధాత్రీతలనాథమణీ.

క. ఇట్టి శుష్కోపవాసవు
కట్టడి నిలుపంగ లేని కాపురుషులకుం
బిట్టవియు నట్టయినను
బట్టెడుపిష్టమ్ము నేని భక్షింపఁదగున్॥

తోహర

అనుచు వసిష్ఠుఁడు దెల్పి యథేచ్ఛన్ జనిన యనంతరము
మనుజవరేణ్యుఁడు మంత్రివిబుధసామంతాదులఁ జూచి

ఆ. ఈవ్రతంబునఁ బలికి యిష్టార్థసంసిద్ధిఁ
బడయవచ్చునని సభాజనమ్ము
లాలకించి మిగుల హర్షసమేతులై
హితవు మీర నృపతి కిట్టు లనిరి॥

తోహర



తప్పరాదురాజాజ్ఞనుఁడే యిదితప్పినపాపముసుండీ
తప్పక వ్రతము సేసినవారికిఁ దప్పదు మోక్షముసుండీ॥

వ. ఇట్లు పాటుటయుఁ గోవ్యాళ్ళకు దైవవశంబున హరివాసరం బాసన్నంబయ్యె నంత రుక్మాంగద ప్రముఖులైన సామంతులందఱు

హంసగతిరగడ

స్నానము సేసిరి సంధ్యను వార్చిరి, మానక హరినామములు జపించిరి, దశమి నేకభుక్తముగావించిరి, వశమతులై యుపవాసంబుండిరి, హరిమంటపమని యటనేర్పరచిరి, హరిని శ్రీరమణినారాధించిరి, కలువపూలతో కవములుగట్టిరి, మలయజగంధాములకము బెట్టిరి, అలరుతేనెతో నర్ఘ్యంబిచ్చిరి, క్షీరోలున కభిషేకము సేసిరి, తులసీదళములతో నర్చించిరి, శౌరియీరని వ్రాళులొనగిరి, పద్మప్రియయుఁడని పాటలు బాడిరి, పద్మనాభుఁ డనిభజనలు జేసిరి, శరణని మ్రొక్కిరి శార్ఙ్గధరుననుం, శరణని వేఁడిరి చక్రాయుధునిం, బరిహరింపుమా పాతకమనుచుం, గరిమ మెలయ జాగరము సల్పిరి॥

గీ. దినము తెల్లవారె క్షీనఁ బూర్వకొండ న
త్తమున్ననందు సుఖవనమున్నలోన
బొంకమయి తనరు మంకెనపువ్వన
బాలసూర్యుఁ డొప్పెఁ బ్రాగ్దిశనిని.

—• తోహార •—

ప్రాతస్స్నాన మొనర్చి పార్థివుఁడు భాస్కరు సేవించి
వేగఁబ్రీతిగ ద్వాదశిపారణ సేయఁబ్రయత్నించి
శిష్టుల సిష్టుల బాంధవజనముల స్త్రీల కుటుంబినుల
శ్రేష్ఠులైన బ్రాహ్మణుల సహానగ్రీతులఁ దీర్చెం చె.

వ. అంత రుక్మాంగదమహారాజు తనయూరిలోని శివ కేశవాలయంబుల కేగి యా దేవతాసార్వభౌములకు షోడశోప చారపూర్వకముగ సహస్రనామార్చనంబుం జేయించి తీర్థ ప్రసాదంబు లందికొని నిజమందిరంబునకు వచ్చెనట.

—• తోహార •—

పవీథులఁ బరికించిన నగరం బేవాడం జూడఁ
బావన మగునేకాదశీవ్రతము పాటింపందొడఁగె
ధారుణీసురుల నవిరైన శ్రద్ధాభక్తిం జూచి
పారణకు వ్యాయింటికి రమ్మని బతిమాలెడువారు
కాంతలు పురుషులు పట్టుఁగోకముఁ గట్టి సోయగముగ
సంతర్పణ మనివిందగ బంతులు సాగించెడువారు
అమదానముల నన్నదానముల నాచరించువారు
అమితభక్తి తాంబూలదక్షిణల నర్పించెడువారు.

వ. పౌరులచర్యఁ గన్గొని ప్రవర్తిలి కొంచ్చుచు నావ్యాకులంబై తోరపుశాకపాకములతోఁ దగు భోజనశాల ద్వాదశి పారణఁ జేసి భూమిపతి బ్రాహ్మణభక్తిపురస్సరంబు బం గారమువన్నె మించె నలిగారపుకూటమి నంటు నెన్నఁగన్

కం. హాటకదానంబులు గజ
ఘోటకదానములుఁ గపిలగోదానంబుల్
కోట్లకు ద్విజకోట్లకు నిడి
శాటీదానము లొసంగె సన్యాసులకున్.

ఆ. నియమ నిలువరించి నీమంబు పెంపునఁ
బగలు వినుచు నుండె భాగవతము
రాత్రి భక్తి మీఱి రామాయణగ్రంథ
పఠనమున ముగించె వ్రతసమాప్తి.

—◆ తోహార ◆—

ఆ రుక్మాంగదకృత మగువ్రతమాహాత్మ్యంబునఁ జేసి
శ్రీరాజిల్లను రాజ్యమంతయు నశేషసంపదలు మెఱసె.

ఆ. కరువుఁ గరువయ్యె సరిపుణ్యకాలమయ్యెఁ
బాడిపంటయుఁ దరుచయ్యెఁ బశుసమృద్ధి
సకలసస్యాభివృద్ధియు జగతిఁ బరఁగె
నెలయునన్నంత వర్షించె, వానవుండు.

ఆనందభైరవి—ఏకతాళము.

ఇదియేమియద్భుతము విదిశానగరమున। మదనజనకుని వ్రతమహిమ చూచితిరా। ఇ॥ క్రమముదప్పినవారుల్ గనుపింపరో। క్రిమికీటకములైన యమపురికి బోదవు। ఇ॥ ఏకాదశి యని విన్న నే ప్రాణికైన నాకొనియున్నప్పటికి నాహారము ల్లదు। ఇ॥ చింతవలికాటి లక్ష్మీధవుని మాయ రవంతలో వైకుంఠ మంచేరిదారు। ఇ॥

—• తోహా •—

శ్రీకాంతున కర్పణముగ పత్రముంజేసిన పుణ్యామునఁ
జేకటి యేర్పడి సంధ్యావళికిన్ జేవిళు లుదయించె

సీ. కన్నులతేటపద్మినవొలఁదీగెనా
దీగెఁగోనికి మేను తెల్లవారె
ముకురమండలి గంధవృంబూని క్రైవడి
దెరవళుంబెక్కుళ్ళ దేలుబ్బుమించె
లేఁదమ్మిమొగ్గ ప్రాలినతేటిపోకువా
నారికిం జనుమొవల్ నల్లబారెఁ
దెదరి చేద్పడు గండుచీమలబారన
వెలఁదికి నూగారు విరియఁబారె

తే. గీ. మంచుదొరఁగిన చంద్రబింబమ్ము రనఁగ
మోము వెల్వెలబారె కెమ్మోవిమారె
గలికినడ మాంద్యమూనెను గాను బలసె
నెలతుకకుఁ దొమ్మిదవనెల నెమ్మినిండె.

తోహార.

సితపక్షంబున గ్రహములుచ్చగతిఁ జెందినకాలమునందు
నుతుఁ డుదయించెను సంధ్యావళికిన్ శుభలగ్నమునందు

వ. శ్రీమతి పట్టపుదేవికిఁ బుత్రోత్పత్తి యగుట కర్ణా
కర్ణికగా విని యంతఃపురస్త్రీలందఱు

కీర్తన.

కమ్మగొందము రారె తొా కనకాంగులార మనసంధ్యావళి
ముద్దులముగబిడ్డం గనెనఁట॥క॥ యువరాజోదయమూమె వవ

లా యేమంటు కువలయానందమ్మునకు నుపిన చేయుదు ॥క॥
నతిపతులొనరించిన వ్రతము ఫలియించెఁ బ్రతిఫలముక్రియ
మాద్దుపాపఁ దుదముంచె ॥క॥ లేక లేక మనకు నీకాలమ్మునకు
శేకొనిముద్దాడ శిశువు లభించె ॥క॥ చింతపలిపాటిప్పుడె శ్రీకాం
తుఁడిశ్వరుని సంతానములే దనుచింత వాసిపడియె ॥క॥

తోహరా

జాబిల్లిం గని యానందించెను జకోరయుగము భంగి
నాబాలుఁ గని జుట్టుకొనిరి పరమానందంబున బాంగి.

క. పుత్రోదయమాయెను
ధాత్రిపతికి విన్నవింప ధాత్రియుక తే యా
మిత్రకులుఁ డంతె కాంచన
గాత్రిక మణిహారమునఁ గానుకఁ గాఁగన్.

వ. వాసియు సమ్మానితులైందు మహోల్లసంబునఁ బుత్రోత్సవంబు నెరపి పదిరెండవనాఁడు పుణ్యాహవాచనపురస్సరంబుగఁ బుట్టినపట్టికి జాతకర్మ గావించి సకలసత్పురుషసభామధ్యమున ధర్మాంగదుఁ డనునామకరణం బిడుటయు నాబాలకుఁడు బాలచంద్రునిఁ బోలి దినదినప్రవర్ధమానుఁడై

తే. గీ. వేదశాస్త్రపురాణప్రవీణుఁ డని
యస్త్రశస్త్రవినోదము దాఁటి తేరి
పూర్ణచంద్రునిమాడ్కి సంపూర్ణకళల
వరలెడు సిద్ధపురుషులకు వాత్సల్యమున నుండె.

—♦ తోహార ♦—

లేనిసుతునకు మాళవభూపాలకతనయఁ జంద్రరేఖ-
అనువంశగఁ బరిణయ మొనర్చి రుక్మాంగదనగరిఁ జేర్చె
పావనచరితుని ధర్మాంగదు హరిపాదభక్తినిరతు
యౌవరాజ్యమున కధిపుఁ జేసెఁ దయ్యెన సుతు ద్గుణభరితు.

ఆ. వె. రాజవలనఁ బ్రబలుఁ బ్రజ చేత రాజు
కచ్యుతాంఘ్రిసేవ యగ్రమయ్యె
మోక్షలక్ష్మి తనకు మూలకందంబయ్యెఁ
గాలు నింటిత్రోవఁ గట్టువడియె.

—♦ తోహార ♦—

నానాఁటికి యమలోకములోని నారకు లరుదైరి
భానుసుతుని సామ్రాజ్యలక్ష్మి భ్రష్టత్వం బాదవె.

తే. గీ. చింతలుచుఁ గార్య మెద్దియుఁ జేయు లేక
చిత్రగుప్తులు నిదభటశ్రేణిఁ దక్క
నన్య లేవారునోపని యామ్యనగరి
నెలమి గొలువుండ దక్షిణాధీశ్వరుండు.

వ. అంతటఁ ద్రికాలవేది త్రిలోకసంచారియు నగు
నారదుండు

కీర్తన—కమాచ్.

రే ర మానవహారిం భజ ర శౌరిం వనమాలినం
మదనకోటిమోహనరూపం మధురాపురగోకులదీపం ॥ రే॥

శంఖినం చక్రిణం గదినం శార్ఙినం దింతపలిపాల్యానిల
యం చెన్నకేశవస్వామినం ॥ రే॥

౨. పున్నెము పాప మీ రెండు పొందకపోదు నరుండు
వెన్నెల చీకటులలీల వెలయుచునుండు॥ రాజ్య॥

౩. హరికి బ్రియము హరికి బ్రీతి సత్యవ్రతము తెలియ
బూనఁ దరముగా దేవ్యాంతైన ధర్మపదాన॥ రాజ్య॥

౪. ఒక్క కృత్రిమంబు బన్ని చిక్కపరచి వదవిరేని నా
క్కపొద్దు నోము మరపూనఁజేసెద॥ రాజ్య॥

౫. కల్లగాదు తెమ్మ చింతవలిపాటిచక్రి నమ్మ మెల్లగా
లమ్మ రానీయఁ డీవ్రిమాదమ్మ॥ రాజ్య॥

• తోహర • —

కాలపాశమును గాలదండమును గైకొని యంతకుఁడు
కాలకింకరులుగొలువఁ బరము కై కదలె మహిషవాహనుఁడు

సీ. శృంగారరసములో బంగారుసరి మిడి
యతిసుకుమారతన్వంగిఁ జేసి
యిందుబింబపు సారు హేమాంబుజపుతీరు
నెగడించు సొగసైన మొగము మార్చి
వాడితూపులతీర్పు లేడిచూపుల తీర్పు
గల మోహపుంగన్నుగవ మార్చి
చామరంబులసొంపు కైవాలముల పెంపుఁ
గూర్చి చీకటికప్పు కొప్పు మార్చి

తే. గీ. చెండ్ల గజరిమ్మ వండ్ల రాదివమిండి
గుండ్ల గెల్చిన గుబ్బచాలిండ్ల మార్చి
కొరతగలవల్ల పండందఁ గొమరుదీర్చి
బ్రహ్మ నాతిశృంగారవృష్టిఁ జేసె

4. అప్పుడెంతవాఁడు రుక్మాంగదభూపాలుఁడు రతిరాజు
బారి సారంగముగాఁ జేయనా॥ నా॥

5. చింతపలిపాద్పురిశ్రీపతి సాక్షిగఁ బంతమీఁడేర వ్రత
భంగము గావించెద॥ నా॥

కం. అరిపగ్గెలాడుకొనయదు
వనజాననుఁ డొనఁగె జాళువాపీనము
గ్రీష్మన నాపెనభవ్యశతమై
పనివిరిమొద ననుచు దివిజవధముల నెపఁ శెవ్.

కీర్తన:

1. వచ్చెమోహిని వనజాయతాక్షి విచ్చలవిడితోఁ గి నచ్చ్యు
లులనుగూడి॥ వ॥

2. ఇందుశేఖరు నిష కామేశ్వరు డెందమందు నమ్మి మంద
రాద్రి॥ ఇం॥

3. మేటిచింతపలిపాటి మురహరిపైఁ బాటపాడుచు నత్యా
టలాడుచు॥ వ॥

—◆ తోహార ◆—

భూలోకంబునఁగలపట్టణములఁ బుణ్యారణ్యముల
లీలాగతిఁ దిలకించుచు మందరశైలమునకుఁ జేరె.

గీ. మందరగిరిపయిన రత్నకందరంబు
మారిల మాలూరవని తూర్పుననుధీర
ధాళధళ్యప్రభా సముద్యోతమైన
యుద్ధకామేశ్వరాలయ మొప్పిగాంచె.

వ. అచ్చోట విమానంబు డిగ్గి ప్రియవయస్యలుం దానును పుష్పాంజలులు ఘటించి నవరత్నలింగమున నభిముఖులై యిట్లని ప్రస్తుతించిరి.

కీర్తన.

నమో నమో నమ శ్శివాయ తె నమో భవాయ తె
ఉమాధవాయ శూలినె చంద్రమౌళినే॥నమో॥
కామసంహారాయ నాగకంకణాయ తె గరళగళాయ తె॥నమో॥
మరణవిదూరాయ జగన్మంగళాయ తె నమో భవాయ తె॥
మునిసేవితాయ దక్షమఖహారాయ తె నమోభవాయ తె
మంత్రరూపాయ గాంగమస్తకాయ తె దిగంబరాయ తె
చింతపలిపాలీపురశ్రీధరాయ తె త్రిపురాంతకాయ తె॥

వ. అని యీశ్వరధ్యాననిష్ఠాగరిష్ఠయై శివాలయము నిర్గమించి బహిర్ద్వారంబుముందట శిలావేదిక పైన సఖిజనముత్రోడ సుఖాసీనయై వీణాగానముం జేయుచుండె నచ్చట.

—•తోహర•—

వనజసంభవునియాజ్ఞచేత మృగవర్గం బిలపైఁ బుట్టి
మునుకొని రుక్మాంగదునిరాజ్యమును ముట్టడించెఁ దలపట్టి.

తే. గీ. పంటచేలన్నిట్టి మల్లాడి పైరుఁ జెఱచి
మారతోట్రుల ఫలవృక్షములను గూల్చి
యడ్డమగువారిఁ జంపి యాపద్దలేక
మెండుకొని తిరుగసాగె నా మృగకులంబు.

వ. ఆ యాగడమునకు నిలువ నీడఁగానక పంటకాపులు

మృగోపద్రవమునకు వెరచి యాస్థానమందున్న రుక్మాంగదుని మ్రోల నిలిచి ముక్త్యేకవాక్యముగ నిట్లనిరి.

కీర్తన.

తప్పింపుమయ్య మాబాధ నీవుదక్క మాకిక దిక్కెది నరనాథా మారగొన్నవి పంటచేలు కాయగస్రుక్కినవి కానకాకాలు॥ తప్పిం॥

ఎక్కడిమాయకాలము రాజ బక్కగొత్తైన దక్క నీయవు॥ తప్పిం॥

రా రమ్ము మాయేలినవాడ కోరుకొండమీద నీ రాముసేన॥ తప్పిం॥

మన్నెడు చింతపలిపాటి చెన్నకేశవస్వామి నిన్ను జూపెను॥ తప్పిం॥

—తోహర—

సామి వేటకు దగుయాన్నింటిను సత్వరముగ సాగింపు
ఆ మెకములరాయుడి మూనిచి మా యలజడి వారింపు.

వ. అనిన ప్రజలకు రా జిట్లనియె.

కీర్తన—శ్యామరాగం, ఏకతాళం.

అన్నలారా దయాళులారా కన్నులచల్లగ మిమ్ము గంటి నేటికి॥ అ॥

వేగు దోచిన నట్టికాలుగలిగిన నోగువాగులకు నే నై యుంటిని గద॥ అ॥

చిన్నలోపక నన్ను వేఱుసేయక చిన్నలు పెద్దలు నం పిస్తిమండుడు॥ అ॥

ఆలసింపక కష్ట మనితలంపక వాలుమెకంబులను గూల్ప వనము కేగద॥ అ॥

నంతసిల్లుచు మీగా టీగా నదనములకుఁ బొందు చింతపలి పాటిహరిసేవ నలుఘుఁడు॥ అన్న॥

—♦ తోహర ♦—

కసికరంబు శిలికించి మిగుల వలకారితనంబుగఁ బలికె
అ ఁనయించి నీ మాటలు నల్లన వనపాలకుం డనిపె.

గీ. ఏను వచ్చుదనుక యిల
నేలుమని రాజ్యభారమెల్ల తన కుమారకునకు
నొప్పగించి వత్రము దప్పకు
మని విదిశాపురపత్తిభుండు సంభ్రమమున.

కీర్తన — బ్యాండు.

వేటలాడ వెడలెను రుక్మాంగద నృపతి మాఖేటసాధనములతో వీటఁబుట్టిన వేటకాండ్రతో నాటవిక బలముల్ కోటానకోటు లనుగమింపఁగ॥ వేట॥

కండక్రొవ్వుచేత మహాకాననసీమల్ నిండి మెండుబలసిన గండభేరుండముల్ ఖడ్గమృగముల్ పుండరీక వేదండ వ్యాఘ్రముల బెండువరమ॥ వేట॥

చింతపలిపాటిపుర శ్రీనివాసుని యంతరంగభక్తుఁడు పొంతలఁ బొంచుచు రంతులుసేయుచు బంత మెలర్వఁగ గాంతారవీథి॥ వేట॥

—♦ తోహర ♦—

గహనదేశమున విద్యాధికుఁడు నుక్కలుఁడు ప్రవేశించి
బహుళంగుల మృగయావినోదము బాటించె నిండి

సీ. శార్దూలచయము నిశాతహేతిని వ్రచ్చి
పటుబాణముల లేళ్లఁ బారఁదరిమి
గండభేరుండవేదండాళి సమయించి
కిటులబలంబులం గీటడంచి
కంఠీరవముల గ్రిక్కదలకుండ వధించి
శరభదుర్భరజవసత్త్వ ముడిపి
వాలమ్ము లేసి సివంగులఁ బోరాడి
భల్లూకములఁ బెక్కు తుత్త్రుళ్ళడంచి
తే. గీ. చిఱుతపులులను శరముల చించిచించి
దోర్బలంబున జింకల దోలిదోలి
జమిలి ముక్కాలి మెకములం జంపిచంపి
గాటముగ నవ్విభుఁడు వేఁటాడె నచట.

వ. ఇట్లు క్రూరమృగాకులమైన యనేకమహారణ్యంబులు జొచ్చి మృగయావినోదంబు నెరపుచు నట్టకేలకుం దోడి సైనికుల కదృశ్యుండై యొక్క కురంగము వెంటఁ దురంగముం బరపుటయు నా లేడి యాశ్రమమృగము గాన రుక్మాంగదు నా వామదేవాశ్రమంబునకుం గొంపోయి యచట నదృశ్యం బైనంత.

—తోహర—

వృద్ధాత్ముం డీతం డనివిదిశాపురపతి రాకఁ గనుంగొని
మాన్యులై యతాపసు లరుదెంచిరి వన్యఫలంబులఁ బూని
క. ఎదురుగ్గొన వామదేవుఁడు
ముదమున రుక్మాంగదుండు మ్రొక్కె నతని ౧౦

పాదవగఁ గుశలమె రుక్మాం
గద యుపదీంచి పలికె గావ మెసఁగన్.

ఆ. వె. రాజచంద్ర మందరమునందు విష్వశా
మేశ్వరుండు పార్వతీశ్వరుండు
గలఁడు భక్తలోకకామితకల్పక
మతనిఁగొల్చి శుభము లందుమయ్య.

—తోహర—

సమ్మతిమీరఁగ వామదేవమునిశాసనమున నృపుఁ డరిగి
అమ్మహీధరము దండసేవలను హయరత్నంబుఁ దొరఁగి
మందానిలుఁ డల్లన నెదురుగ రా మానసాబ్జ మలరార
మందరాచలం బెక్కి నివశులుఁ దమందానందము మీర.

గీ. అచల మెక్కినా లేదా రుక్మాంగదునకు
నెదురుగో ల్పసి మోహినీ కృతమనోజ్ఞ
వల్లకీగానవినదంబు వలపు మందు
పగిది తహతహఁ గల్పించె భావమందు.

శా. నానాటం జెవులార తుంబురుని వీణాగాన మాలించితి
న్నానాటం జెవులార శంకరునివీణాగానము న్వింటి ము
న్నానాటం జెవులార నారదుని వీణాగాన మాలింతు ము
న్నా నాఁ డంతమనోజ్ఞపాటవులు వాయింపంగ లేదా ఘనుల్

గీ. అనుచు బాగడి మీర శివాలయమున
పారిజాతసుగంధంబు పర్వి కొనఁగ
వీణవాయించు మోహినీవిద్రుమోష్ఠిఁ
గాంచె నరపతిఁ గన్నులకరవుదీర.

జంఝూటి—ఆట.

1 ఎవతో బలువన్నదిగా యీడవ్వని నవ్వనాగుహూఁ
మాతో నివ్వటిల్లుచున్నది॥ ఎవ॥

2 మున్నన్నఁ జీవన్నెలాడి కన్నది విన్నది గాదు వాన్న
నికోడలికన్న మిన్నదై మెరయు నిది॥ ఎవ॥

3. మక్కువదీరగ దీని చెక్కిలి నొక్కగలిగినచక్కఁ అతో
ముక్కంటి కొక్క ప్రోద్దుండేనా॥ ఎవ॥

4 ములికనవ్వులుకులాడి తళుకుబెళుకుమావుంది వలు
కునో పలికదో దీనిభావ మెట్లున్నదో॥ ఎవ్వ॥

5 చింతపల్లిపాటివుకీచెన్న కేశవుని దలఁచుచు నుంతయిన
నావంకఁ జూడదింకేమిసేతు॥ ఎవ॥

మ. తనుజేరం జనుదెంచు భూపతిని గాంతారత్న మల్లంతటం
గని యాత్మీయుననఖిజనపరికరముం గన్నన్న గావింప నా
వనితల్ డిగ్గున లేచి యేగి రుదితవ్యాపారపాకీణలై
యనుమానింపు చునుండ దివ్యసతిడాయంజోయి రాజిట్లనున్

జంఝూటి—జుల్వ.

1 ఎవ్వరిదానవె నీవృత్తాంత మేము దెల్పు కొమ్మిద్దరి
జోడి సాగసైన కోడెమిటారి మరునికటారి॥ ఎ॥

2 త తకమేలనె నీకుఁ దగినమగవాఁడ నేనె గుతంగు
ళ్ళలాడి పరిత్యుత్తర మీయవె చయ్యన॥ ఎ॥

3 మాటికిఁ జింతపల్లిపాటి చెన్న కేశవునిపైఁ బాటపాడు
చు నీనెమిటారి మెళగించెదవు॥ ఎ॥

—♦ తోహార ♦—

ఎంనాంగరో విదితాముహాసగర కులువాడ నేను
కలువకంటి రుక్మాంగదుఁ డంమరు కరుణింపవె నన్ను
ఆలింపావె నాపలుకులు మర్మము జాలింపవె లలన
పాలింపవె తన్వంగి వసన్తమునిబాధి కోర్వఁజాల
నాతోడం బ్రియభామలాడవె నాము ద్దులగుమాత్ర
చేతు లొగ్గితి నీచిత్త మ్మెటుజేసిన కేయఁగదే.

క. వలరాజుచేతి బంగరు
  చిలుకా వలపులకడాని చిత్రరుపలకా
  కులుకపవ్వగులుక నాతోఁ
  గలికీ పలుకాడవేమి కారణముకా.

దర్బారు—ఆట.

1 ఏటికె యీ బిగువు నాతో నొక్క మాటాడ నుంకిం
  పవు పాటలాధరి యొక్క మాటైనఁ బలుకవు నోటి
  ముత్యాల్ చిందునా పలుకులజంటితేనె లూటలూరునా
  సుధారసపుతేట జాలువారునా నోటిమాటలకైన నోచ
  కొన నైతినా॥ ఏ॥
  ఊాటివిద్యగుబ్బలైన [illegible] ంథునా
  నవరత్నాలవీణె మోగింతునా సరసీటులు గులికింతునా
  నయ్యాటకు నిను జార్తునా మంచిపాటఁబాడవె మరు
  ఘోటి గుణములపేటి॥ ఏ॥

## కన్నడ—ఆట

1 చక్కెరబొమ్మ చాలునె పంతము సిగ్గు మానఁగ దెలుప
వె నీ శుభవార్తలు॥ చ॥
2 భూనాయక నను మోహిని యందురు మానుగ బ్రహ్మ
మానసపుత్రికను॥ చ॥
3 ఇచ్చట నుంటకు హేతు వదేమిటి మచ్చెకంటి మనసు
మర్మము డాపకె॥ చ॥
4 ఇందుచూడామణి నిష్టకామేశ్వరుఁ జెందామరలఁ బూ
జింపుదు నతతము॥ చ॥
5 మీరాకలు గట్టి నీ ముందట నిలిచెద రీకలవాణి లేమి
గావలయునె॥ చ॥
6 అనుఁగునెచ్చెలులు నా యానతి మీరరు కనకాంగులు
దేవకన్యలు వీరలు॥ చ॥
7 మరువిబలంబున మది వరియించిన పురుషుఁ డెవ్వఁడె
నీకు పూర్ణచంద్రాస్య॥ చ॥
8 మనుజాగ్రణి వేయుమాట లింకేటి మనసుకువచ్చిన
మగని నెఱుంగను॥ చ॥
9 చింతపలిపాటిశ్రీపతి సాక్షిగఁ గాంతరొ నీమనఃకాంతుఁ
డ నేనే॥ చ॥

వ. ఇత్తెఱంగున మోహిని నిజవృత్తాంతముఁ దెలిపియు వలకారితనమ్ముగఁ బలికియు వలచివలపించియు మోహావిచేష్టితంబు నెరపియుఁ జేరాసఁ గల్పించి వ్యామోహసముద్రమందు మునిఁగి మనసు వశముగాక మరల రుక్మాంగదుఁడు.

కం. స్యందనమునందవేలుపు
సుందరవదనను నిది సేన గొనియాడఁగఁ బౌ
రంధరవిభవముతోఁ గను
విందుగఁ జేరెను నృపుండు విదిశాపురమున్.

—♦ తోహర ♦—

జనకునిరాకను ధర్మాంగదుఁ డనుచరులవలన నెఱిగి
పరివారలతో మంత్రులతోఁ దనజనకుని నెదురేగి
మ్రొక్కుటయు రుక్మాంగదుండు ప్రియపుత్రుఁ గౌఁగిలించి
అక్కరతో బురజనుల నందర నాదరించె మించి

తే. గీ. మోహినిం దాను గాంధర్వమున వరించు
టాదిగాఁ దెల్లడించి ధర్మాంగదునకు
బ్రహ్మమానసపుత్రి యివ్వధటి నీకుఁ
దల్లివరుసది యన నేను దయ దలిర్ప.

—♦ తోహర ♦—

మోహినిరాకకు ధర్మాంగదుఁడు ప్రమోదంబుం జెంది
ఆ హరిమధ్యను విడియించెను శుద్ధాంతంబుం జొప్పించి.

వ. అంతటఁ గొంతకాలంబునకుఁ గాలక్రమంబున శరత్కాలం బేతెంచుటయు నా కార్తికమాసమందు.

తే. గీ. మోహినీకృత మయినవ్యామోహమందు
మునిఁగి రుక్మాంగదుఁడు బుద్ధిమాపపోయి
సురతదోహలమున సురముదతిఁ గూడి
పగలు రే లరయకుండెను దగులమెత్తి

— తోహర —

ఎల్లవారువిన పురుషుం డేమఁగునక్క భేరి వేసి చేతు
నల్లివచ్చె నేకాదశి యిదే యని హెచ్చరికలుసేయ
సాటెడువాక్యము రుక్మాంగదునకు శ్రవణరంధ్రములుసోఁక
గాట మైనయుగ్మలి కౌఁగిలి గరమున దిగిచెన్వేఁక.

వ. రుక్మాంగదుండు త త్తరిల్లుచు పాన్పు డిగ్గి యహో స్వేచ్ఛంబయిన భోగేచ్ఛం దవిలి యేకాదశీవ్రతంబు మరచితి నెంతపాపి నెంతగురుద్రోహి ననుచుం దన్నుఁ దా నిందించు కొనుచుఁ దత్క్షణంబ.

తే. గీ. స్నానమాడి నిష్ఠ సంధ్యాకృత్యములఁ దీర్చి
వ్రతముకొఱకు పరికరములు గూర్చి
సతుల హితుల బంధుసంఘంబు రావించి
పట్టమహిషితోడ భానుకులుఁడు.

కీర్తన.

ఆచరించెను రుక్మాంగదుఁడు హరివాసర మనుసువ్రతము॥ఆ॥

1 ఆచారవేత్తలు ఆవేళ శుభసూచకముగ పుణ్యాహవాచనములు గావింపఁగ॥ఆ॥

2 తేజరిల్లఁగ గృహమందు మణిదీపికలు పూజాద్రవ్యంబులతోఁ బుష్పోపహారములతో॥ఆ॥

3 వాద్యకారులు వైభవము మీర హృద్యం బగుపంచ మహావాద్యంబులు మ్రోయింపఁగ॥ ఆ॥

4 పేరజాతులు నివాళు లెత్త వారవధూమణులు లాడఁగ వందిమాగధులు పాడఁగ॥ఆ॥

5 స్వాంతమందు సంశయము మాని చింతపలిపాటిపురశ్రీ
ధరుని ధ్యానింపుచు॥ అ॥

తే. గీ. తుళ్ళిపడి లేచి మోహినీ వల్లవాక్షి
గృహము వలువంకలం బరికించి యెంతఁ
బార్థివునిగానమిం బూలపాన్పుడిగ్గి
తత్తరిల్లుచుఁ గదలె నంతఃపురంబు.

—॥ తోహర ॥—

కదలినపట్టాంశుకముతోడ ముడిసడలిన వేనలి తోడ
ప్రిదిలిన కాలిమితోడ డాసెఁ బృథ్వీనాయకు నాప్రోడ

వ. వచ్చినన్నాహముం దిలకించి మోహిని క్రోధఘూ
ర్ణితలోచన యై వల్లభున కిట్లనియె.

బేహాగ్—ఏకతాళము.

ఏది రారాజ నర్మ మేది రారాజా ఏది నీసై జమేది
భూభుజ॥ ఏ॥ కల్లలాడితివి యిల్లుసొచ్చితివి పల్లదుఁడ యూవ
నిఁ బూనితివి॥ ఏ॥ బాసచేసి వడ బాయనంటివి కోనకాఁరి తుద
కు మానగించితివి॥ ఏ॥ ఒట్టుబెట్టితివి పట్టుబట్టితివి గుట్టుకాకరి
నాకొంప దీసితివి॥ ఏ॥ వంతగించి చింతపలిపాటి మురాంతకుని
పైన నానబెట్టితివి॥ ఏ॥

ద్విపద.

ఓరికృతఘ్నుడ యోరిదుర్మార్గ
యూరార చెంతటిపొంతకుడవురా

ప్రోదిగాఁ బెనఁచుకొన్న మోహలతాంతయును
బూదిలోఁ ఘృతమిడ్డ పోలికగాఁగ
వల్లభ నీవిట్లు వ్యర్థంబు చేసి
యుల్లంబు మరలింప నుచితకృత్యంబె
నామీఁది ప్రేముడి నాయము మోపీడ
నీమోహవార్ధిని నెట్లీఁదుదాన
గడితైన నినుబాయఁగలనె నేనింక
దడవేల కేలెత్తు ధాత్రీశ యనుచు
గరము గరమునను గడువడిం బట్టు
ధరణీధవుఁడు సురతరుణికిట్లనియె.

కాంభోజి — ఏకతాళము.

వదలవె నాచేతులు భామా లేమా రామా
రామాలలామా॥ వ॥
వదలక యిన్నిట్లు వంచనసేయంగనేల॥ వ॥
పదుగురు నగుదురు పడతిరో యిది మేరగాదు॥ వ॥
హరివాసరవ్రతము చెరుపంగ నీకేమిఫలము॥ వ॥
పతిమాట జవదాటు సతులకు సరసముగాదు॥ వ॥
చింతవలిపాట్ప్వారి శ్రీపతి సర్చింతునింక॥ వ॥

— హారతి —

నాకేటికి మదిఁజాలి గొసంగ నాతిరో శ్రీపతియాన
ఏకాదశులం గలయరాదు నే దేకాదశిగాన
ఓకాంతామణి నీవును నావలె శుభభావంబుండి
శ్రీకాంతుని బూజింతురు లక్ష్మీ చిరసౌభాగ్యంబబ్బు

నిన్నింతజేసిన నీమంబుతెరచి
వన్నెగానీవ్రతభంగంబుచేతు.

వ. అని యాగ్రహంబున దక్షిణహస్తము గ్రహించి మోహిని యీడ్వ రుక్మాంగదుండు.

కీర్తన—ఆరభి.

1 విడువిడుమా నామోహిని చేయివిడువుమా పుడమి
వేలుపులు పంతలనిలచిరి పోవదొడంగెను బుణ్యాసమ
యము చెడునన్యాయమా కాండవెల్ల నీయడుగుడమ్ము
లకు మ్రొక్కెదను॥ విడు॥

2 పాతివ్రత్యము భంగమగుపతికి బ్రతికూలముగా నతి
మెలంగుట నీతిగాదు వివారగదా ధర్మము చేతులార
హరిపూజనమ్మను॥ విడు॥

3 పతియేకార్యము గావించిన దత్సతికి జెందనగు సమాన
భాగము మతిసెసి నిర్బంధించెద వయుమో యతివా
బ్రతిమాలిన వినవైతివి॥ విడు॥

4 దంతిగమన వ్రతరాజముముగిసిన దమపతి నీయిష్టాను
సారము జరింతు తంతపల్లి పాటి నిలయుడగు శ్రీకాంతుం
డదసాక్షిగనమ్ము॥ విడు॥

కం. వ్రతము గలదనుచునీతో
పతివాచెప్పుటను మరచి తది మున్నతంబె
రతిసౌఖ్యముగోరి విష్ణు
వ్రతరాజము విడిచెంట వలతితనంబె.

—♦ తోహర ♦—

వేయిటికేనియు బొంకనమ్మ పదివేలకునైనను బొంకక
న్యాయము వృథగాఁ జేయకుండుటె నైజమెప్పుడు నావంక.

సురట.

మానజాలనికోమలి యీవ్రతమును ॥ మా ॥ మాను
కొనరాని వ్రతమిది ననుమానుమన నేనెట్లుమానుదు॥ మా ॥
భూమినారాజ్యము సమస్తభోగముల విడ్డింతుగాని భామరో
యేకాదశి వ్రతభంగమున కోర్వంగలేన॥ మా॥ ప్రాణపదమైన
వెలయు నాప్రియసూనుడునుము మటన్న మనుముడుగాని హరి
వాసరముపీడ మానసంబాల్లదేమందు॥ మా॥ చింతపలిపాటిపురి
చెన్నకేశవు డెరుగడా నాయంతరంగ వినిశ్చయము ప్రాణాం
తమైనను భయములేదిక ॥ మా॥

వ. అనుటయు మోహిని రుక్మాంగదుని మనోనిశ్చయ
మునకు దిగులొంది ఆహా కార్యంబుదప్పె నింకేమి సేయుదాన
నని చయ్యన నోకకృతిమంబు బన్ని రాజేంద్రునకిట్లనియె.

కీర్తన.

ఓరోరి దుర్మతి యిదిమేరా దుర్మతి గారాబంబుసగని
పెంచిన కుమారు దునుముదననోరట్లాడెను॥ ఓ
స్త్రీహత్యలు శిశుహత్యలు జేసిన ద్రోహమెన్నటికి దో
లఁగునురా॥ ఓ॥
చింతపలిపాటి శౌరిసన్నుత కులాంతకుఁజేయ సద్గోగతి
గాదా॥ ఓ॥

తోహర.

అతికఠినములగు మోహినివాక్యములాలకించి వెరగంది
ప్రతివచనంబులు మానియుండెనరపతి విభ్రాంతిచెంది

ఆ॥ అకనికల్పమైన యాలాపములకు
సంధ్యావళి వధూటి తల్లడిల్లి
దుఃఖవార్ధిమునిగి తోస్త్రోద మోహిని
కాంత కిట్టులనియె గదియ నేగి.

ఫీల్—ఆట.

1 శ్రీకుమారునిబోలు మాకుమారునిజంప నీకేమివగ జేసెన
నిర్దయురాలా॥ శ్రీ॥

2 కాకిగన్నబిడ్డ కాకికిముద్దను లోకోక్తి వినలేదటె నిర్ద
యురాలా॥ శ్రీ॥

3 రాజునీవాడైన రమియింపవె యువరాజు గూల్పనేటికె
నిర్దయురాలా॥ శ్రీ॥

4 ప్రాణముండిన యడవిబలుసాకైనదిని మానుడు బ్రతు
కుగదె నిర్దయురాలా॥ శ్రీ॥

5 చింతపలిపాటి చన్న కేశవస్వామి కెంత భారమాయెనే
నిర్దయురాలా॥ శ్రీ॥

వ॥ ఓసి నిర్దయురాలా గొడ్రాలు బిడ్డకుట్టురుంగదనట కల్లా నీవు గొడ్రాలవుగాన బుత్రుని గడతేర్పుమంటివి కటకటా నీవాలుకెటులాడెన మెట్టి దుష్కర్మమున గొడిగట్టితివి చెంతు దియ్యనిది యని వేళ్ళంట నమలుదురా దురాత్ముగాల యీ

భూపతివ్రతంబు మానుప బ్రహ్మాదుల కలవిగాదు నీవా చెరుప సమకట్టితివి చాలుంజాలు. నిలునిలుమని పాశినేశ్వరుడిక్కు మొగంబై.

తోహర.

మానవనాయకవినుము మాధవుడో మాధవుడో వాగ్ధవుడో
మానసశుద్ధి బరీక్షించుట కిమ్మౌనిని బంపగనో వు

కం॥ గాన వృథా శంకింపక
నూనునిదునుమాడి సకలసురలు మెచ్చనీ
మానృతము గాచుకొనుము
ధరానాయక పొల్లుపోని వ్రతనియమముకై॥

వ॥ తొల్లింటిపెద్దలు తమతమ పుత్రకళత్రములనైన నశ్వకశీరంబునైన ధారవోసి యశోధనం బార్జించిరని వింటిమి యీరీతినున సాహసించి వ్రతహానికాకుండ జక్కజేయుడని బోధింపుచుండు సమయంబున మోహిని మరల నిట్లనియె॥

హిందుస్తానితోడి.

1 యీకులేని కరుణ మా కేటికి భూరముగ యీ కుమారు
జంపికొన యీ కేబుద్ధి బాడమైనా॥ యీ॥

2 చంపుమురాసుతుని పరికింపుము ముందుగతిని జంపవేని
వ్రతము వర్జించుట నామతము॥ యీ॥

3 చింతపల్లిపాటి వారినేవ మదిని నాటి పంతమున నాకోటి
పరభామ కురవమైన మేటి॥ యీ॥

తే॥ గీ॥ తల్లిదండ్రులు వ్రతముకై తల్లడిల్లు
భంగి వినికానభేదభావంబు వీర

సమలగుణభూషణుండైన ధర్మాంగదుండు
నరుగవిచ్చేసె నావ్రితస్థానమునకు॥

కం॥ వచ్చినపుత్రుని గనుఁగొని
మచ్చికతో నెదురువోయి మనుకులతిలకుం
డచ్చెరువిడ వాని కౌఁగిట
గ్రుచ్చి దయారసము గడలుకొన నిట్లనియెన్॥

జంఝూటి—ఏక.

1 రమ్మిక సర్వోత్తమమగు వ్రతరాజముగందువు కదలి
వేగిరము॥ ర॥

2 కమ్మనివిలుకానిమించు గారాము ముద్దులకుఱ్ఱ॥ ర॥

3 ఇందిరకు ఫణిశయనునకు నిలువేల్పులకు మ్రొక్కుము
బిడ్డా, వందనమ్ముఁజేసి సభకువచ్చి కూర్చుండుము॥ ర॥

4 వ్రతముకై మోహినితమ్మతో బ్రతినబూనుకొంటి నేడు
క్షితిలోన ధర్మస్యత్వరితాగతియనివచియింతుగాన॥ ర

5 చింతపలిపాటిపురి చెన్నకేశవునెద లోనమ్మి నిశ్చింత
బూని కొడుకానీదు శిరముఁగోయఁ బిలచితిని॥ రమ్ము॥

తే॥ గీ॥ అనిన దనయుఁడనియె నయ్యానివేకాద
శివ్రతంబుకొఱకు చేసినట్టి
ప్రతినదీర్పవాదు ప్రాణ మీయమెచ్చి
యంతకంటెఁ బుణ్యమెద్ది తండ్రి॥

తోహార.

నందను దునుమగరాదను నీమది సందిగ్ధంబుడిగి
పొందుగనిప్పని సాగింపుము గోవిందుని గొనియాడి॥

వ॥ అదిగాక యనిత్యంబు జరామరణ దూషితంబు వ్యాధిగ్రస్తంబు జుగుప్సితంబైన యీశరీరమందు నాకు మమత్వాభిమానంబులు లేవు వ్రతముకై శ్రీపతికి దేహమర్పించి శాశ్వతసుఖం బనుభవించెదనని పద్మాసనస్థుడైన కుమారుం దిలకించి రాజపరమేశ్వరుండు.

—• తోహర •—

శరఖడ్గము ఝళిపించి యెత్తరాగా మోహినివీక్షించి
ధరణీశా నిలునిలుమని పలికె స్వదక్షిణకరము గ్రహించి

కీర్తన.

కన్నకొడుకుం జంపనేటికి॥ అయ్యయ్యో॥ క॥
ఎన్నోనోముల్ మున్నునోచి చిన్నారిపాపని గన్నవార
లో కన్నమమకారము గాలిపోయెనా॥ క॥
క్షితిలోకులలో సుతహీనులకు గతులు లేవనుచు స్మృ,
తులు మొరలిడ గతియెటులంగ వేరా మతివిహీనుడా॥ క॥
యింతలంత ల్పంతేదిరా చింతపల్లిపాటి శ్రీవాణిసాక్షిగ
హంతకుడా చాలుంజాలు నిల్వరా॥ కన్న॥

—• తోహర •—

అటులానిని యా కేయుజాలకి హా దివిన వ్రతమునకై
వరతనయుని దెగటార్పఁబూనితివి వల్లభ పన్నిదమునకై
దబ్బరపల్కులు వా ఈంటిమనది ధరణిప యెందును లేదు
మబ్బునమిత్రు చెలువునీరు క్రొంవుట మానుటకు తగదు.

వ. అని రాజునకు మెప్పుబుట్టం దెల్పి ధర్మాంగదునిం జూచి.

ఫీలు—ఆట.

1 లేచిపొమ్మా తనయా లేచిపోవయా నీచమరణముగోర నీకేటికయా॥ లేచి॥

2 తల్లిగాదిది పెద్దదెయ్యంబుగాని తల్లితనయునిపైన దయదప్పునటరా॥ లేచి॥

3 తండ్రిగాడువీడు దానవుడుగాని తండ్రి కొమరుని జంపదలచునా కత్తా॥ లేచి॥

4 శూరధర్మముగాదు సుతుడ లేలెమ్ము వీరస్వర్గముతో త్రోవజాలకి కొనుమయ్యా॥ లేచి॥

5 రాకుమారునకు బర్రాశ్రవణినికి నేకాదశీమరణ మెంతైన గలదె॥ లేచి॥

6 చింతపల్లిపాటి చెన్నకేశవుడు గొంతుకోసకు ముక్తి గూర్చునాబిడ్డ॥ లేచి॥

వ. మరల రాజు దిక్కుమొగంబయి యిట్లను కటకట్రా దయా! ఇంకను కత్తిడింపవుగా కొడుకుం జంపి కోడలి గోడెట్లుచూడగలవు చూడంజాడ నీనడువడి కాల్చివోను రోకలి తలకుం జుట్టుమన్నట్లున్నది.

ఆ॥ వె॥ ఒక్కకొడుకుగాని పెక్కండ్రుగారము
దిక్కునీకె యింకఁ దెరిజూడ

మాయపేరు లేని పేరాసగూర్చు నీ
వ్రతము దేవుడెరుగు వదలుమి సతి॥

వ॥ నావుడు రుక్మాంగదుఁడు చిఱునగవునగి బ్రహ్మేంద్రాదు లడ్డపడినను బ్రతిజ్ఞమాననని మోహిని నవ్వులకుం ద్రోచి॥

తోహర.

కీలనున్న ఖడ్గమున వ్రేయగా శ్రీలోలుని కృపచేత
పూలహారమై చుట్టుకొనియె రాపుత్రుని కంఠంబునకు
మరలనొక్క కరవాలము విసరి కుమారుని మెడకన్వయా
విరిగితునకలై నేలబడియెనా వేఁటువు వెలంది యరయా॥

వ॥ అత్తరి తనయత్నంబు నిష్ఫలంబగుటకు రుక్మాంగదుండు వెరగంది తనలో హా దైవమా! యిదియేమియింత యనేక శత్రురాజన్య శిరోనికృంతనంబగు నాయుధము రాచపిన్నవాని కంఠనాళముం ద్రెంప నోపదయ్యె. వాడి చెడెనో లేక యస్మద్దోస్సారంబు నిస్సారంబయ్యెనో గాక యిది పరాత్పరునిమాయయో తెలియఁజాలనని మహాక్రోధంబున వేఱొండు కరవాలము గేలనంకించి యుట్లనియె॥

తే॥ గీ॥ వేదములు సత్యమగునేని విష్ణుపాద
భక్తి నాయందు నిచ్చలుం బ్రబలునేని
సత్యవంతుడనేని యీసారి సుతుఁడు
కంఠలుంఠనుడగుగాక కత్తిచేత॥

వ॥ అని కుమారుని నరుకఁబోవ భక్తరక్షాపరతంత్రుఁ
డైన భగవానుఁడు పక్షివాహనుఁడై తక్షణంబ సాక్షాత్కరించి
ధర్మాంగదున కడ్డమై॥

కీర్తన.

ఆగుమాగుమోయి భూపతి రుక్మాంగదా॥

1 వేగిరింపవలదు నీవీరవ్రతము మెచ్చుకొంటి॥ ఆ॥

2 నీమనస్సంశుద్ధి దెలియుగా రాజేంద్ర సురకామిని మో
హినివచ్చెను కామితదిగా జేర నీనోము సఫలమాయె
నేడు॥ ఆ॥

3 చింతవలదిపాటిపురము నా వెలుగు మెచ్చితి చెన్న కేశవుడ
నే నేరా సంతతంబునీకునాదు సాయుజ్యపదవి నొసగితి॥ ఆ॥

ఆ॥ తక్షణంబయెదుట సాక్షాత్కరించిన
దివ్యపురుషు విష్ణు దేవుఁజూచి
వాలుక్రిందవైచి కేలుంగవ మోడ్చి
భాగవతుఁడు మిగుల బ్రస్తుతించె॥

కీర్తన.

1 నమోయుంచెదనిను జగదాధారా॥ శరణాగతజన భయ
విమోచన శార్ఙ్గకరానన మోక్షసాధనా॥ న॥

2 మత్స్యరూప కూర్మస్వరూప యచ్చాభద్ర నృసింహ
వరాహావతార॥ న॥

3 రామరూప రఘురామరూప బలరామరూపహో వా
మనరూపా॥ న॥

4 బుద్ధరూప కలికిస్వరూప షోసిద్ధ త్రిలోక విమోహన
రూపా॥ నమ॥

5 చింతపలిపాట్పురి మాధవ చెన్నకేశవ శ్రితనిధా శివా॥న॥

వ॥ అని వినుతించు భక్తునకు భక్తకాముఁడుండః యె॥

తోహార.

నీకుమారునకు నీభార్యలకు నీపరివారంబునకు
వైకుంఠావాసము గల్పించితి వసుధనాయక తుదక॥

వ॥ మరియు ద్వాదశీవాసరోత్తరక్షణంబున నిద్రించు మనుజుల సుకృతఫలము నీ మోహిని యపహరించుగాత! ధర్మాంగదుడు తన జీవితకాలంబుదనుక ధరా పరిపాలనంబు చేయించి యామీఁద పరమపదంబున కేతెంచుంగాక నీరాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁ గావింతమని తగువారినంపి సముద్రోదక జలం దెప్పించి యద్దేవతా సార్వభౌముండు ధర్మాంగదుఁ గుఱంగ సామ్రాజ్యధురంధరుం జేసి,

తోహార.

ఆచంద్రార్కము రాజ్యమేలు ధర్మాంగదయని దీవించి
ప్రాచుర్యంబుగ ప్రత్యక్షుఁడవై వరబలుమనివె గరుణించి॥

వ॥ అంత నాగమలాకాంతుఁడు రుక్మాంగదు నీతని కార్యం నూర్వర దివ్యవిమానం బెక్కించికొని పరమపదంబునకుఁ గొంపోయెనని సూతుఁడు శౌనకాదుల కెఱింగించిన మాత్రముల సూతునగ్గించి రుక్మాంగదుని చరిత్రము నెఱవ్యుచు భేద్యంజేరి.

కం॥ ఏకాదశీ మహాత్మ్యము
ప్రాకటముగ నెవ్వరేని బఠియించినచో
శ్రీకాంతుని కృపచేతను
వైకుంఠావాసమబ్బు వారలకున్ మదిన్॥

ఇది శ్రీ మద్వంగల చిన్నికృష్ణయ కవిప్రణీతంబైన రుక్మాంగదచరిత్రము గేయ ప్రబంధము సర్వము సంపూర్ణము.



శ్రీవిద్యానిలయ ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము